ఒకప్పుడు బ్రహ్మకి సృష్టి చేసే శక్తి తగ్గిపోయింది. అందువల్ల ఆయన నన్ను గూర్చి, జోగులాంబ సన్నిధిలో తపస్సు చేశాడు. నేను అప్పుడు ఆయనకు ఒక బాల బ్రహ్మచారి రూపంలో దర్శనమిచ్చాను. ఆయన నన్ను గుర్తు పట్టి వెంటనే శివస్వరూపంగా ఆరాధించాడు. అందువల్ల అక్కడి నా మూర్తిని మునులందరూ బాల బ్రహ్మేశ్వరుడు అని పిలిచారు.

ఇలా కొన్ని యుగాలు గడిచింది. నా అంశతో జమదగ్ని మహర్షి జన్మించాడు. ఆయన జోగులాంబాంశతో జన్మించిన రేణుకా దేవిని వివాహ మాడి హలంపురంతో నా సన్నిధిలో తపస్సు చేస్తూ వుండేవాడు. మహా పతివ్రత అయిన రేణుకాదేవి రోజూ తుంగభద్రలో స్నానం చేసి, అక్కడి ఇసుకతో కుండచేసి, దానితో నీళ్ళు తెచ్చి పతిసేవ చేసేది. చాలా ఏళ్ళు జరిగాక, ఒక రోజున రేణుకాదేవి నదిలో స్నానం చేస్తూ వుండగా, ఒక గంధర్వ దంపతులు జలక్రీడలాడుతూ వుండటం ఆమె కంట పడింది. వారి ఐశ్వర్యానికి ఆశ్చర్యపోతూ, ఆమె అలా చూస్తూ వుండిపోయింది.

కొంతసేపటికి తెలివి వచ్చి గబగబా స్నానం ముగించి ఇసుకతో కుండ చెయబోగా ఆ రోజు కుండ తయారు కాలేదు. ఆమె కంగారు పడి విశేషంగా ధ్యానించి ఎలాగోలా కుండ తయారు చేసి నీళ్ళు తీసుకు వెళ్ళింది. ఇంటికి వెళ్ళేసరికి, భర్త ఉగ్రుడై వున్నాడు. కుండ తయారు చేయడంలో ఆలస్యం ఎందుకు జరిగిందో, ఆయన గ్రహించాడు. ఆగ్రహంతో పుత్రులను పిలిచి ఆమె తల నరికి వేయమన్నాడు. మొదటి నలుగురూ దానికి ఆంగీకరించలేదు. ముని మరింత మహోగ్రుడై ఐదవ పుత్రుడైన పరశురాముడ్ణి పిలిచి తల్లిని అన్నలనూ కూడా నరికి వేయమన్నాడు. మహా వేధావి అయిన పరశురాముడు అరక్షణంలో ఏదో అలోచించి, కన్ను మూసి కన్నుతెరిచే లోపల ఐదు తలలూ నరికేశాడు. పూర్తిగా చల్లబడిపోయిన జమదగ్ని మహర్షి కొడుకును కౌగిలించుకొని ఇష్టం వచ్చిన వరం కోరుకోమన్నాడు.

"అన్నలనూ, తల్లిని బ్రతికించు, జరిగిన సంఘటనలు వారికి గుర్తులేకుండా చేయి" – అన్నాడు పరశురాముడు. జమదగ్ని పరశురాముడి తెలివికి ఆశ్చర్యపోతూ తథాస్తు అన్నాడు. అన్నలు బతికారు. రేణుకాదేవి మొడెం కదలసాగింది. తలా బతికింది. కానీ, ఎందుకో ఆ తల వచ్చి మొండానికి అతుక్కోవటం లేదు. జమదగ్ని

ఆశ్చర్యపోయి ఏమిటా అని చూసేనరికి రేణుకా దేవి శిరస్సు కుండలు చేసే వారి చేతిలో వుంది. వారు అంతకు ముందే నుంచే ఆమెను తమకు మాతృమూర్తిగా భావిసున్నారు కనుక తెగిన రేణుకా దేవి తల వెళ్ళి వారి చేతిలో పడ్డది. మళ్ళీ బ్రతికినా సరే ! ఆ తల ఇక వెనక్కిపోవటం లేదు.

ఇది గమనించిన జమదగ్ని మహర్షి రేణుకాదేవి మొండెమును బాలబ్రహ్మేశ్వర స్వామికి ఎడమవైపున భూదేవిగా స్థాపన చేశాడు. రేణుకాదేవి శిరస్సును కుమ్మరివారు తమ కుల దేవతగా ఆరాధించుకునే ఏర్పాటు చేశారు. ఆనాటి నుంచి ఈమెను కుమ్మరివారు 'ఎల్లమ్మ' అనే పేరుతో గ్రామదేవతగా ఆరాధిస్తున్నారు.

ఆ తరువాత తుంగభద్రా, కృష్ణానదీ సంగమం స్థానంలో పరశురాముడు సంగమేశ్వర ప్రతిస్థాపన చేసి, అక్కడి పిండప్రదానాలు చేశాడు. అప్పటి నుంచీ హాలంపురానికి పరుశురామ క్షేత్రం అని కూడా ప్రసిద్ధి వచ్చింది. బాల భక్తా! నీవు ఆ క్షేత్రాన్ని ఉద్ధరించడానికి జన్మించావు. నామరూపాలు లేకుండా శిథిలమైపోయి వున్న అక్కడ దేవతా మూర్తులకు నీవు వినూత్న మందిరాలు నిర్మించి భక్తులకు ఉపకారం చేయాలి.

రేణుకాదేవి ఇసుకలో కుండ చేసిన రసవిద్యనూ, దాని కంటే మహత్తరమైన బంగారం తయారుచేసే రసవిద్యనూ కూడా నీకు నేను అనుగ్రహిస్తున్నాను. శిలలు నీకు జీవవంతములై మాట వింటాయి. క్షేత్ర నిర్మాణ సంకల్పాలను నేను అనుగ్రహిస్తాను. నిన్నూ నీ తల్లినీ ఆ బాల బ్రహ్మేశ్వరుడే తగిన కాలంలో తనలో లయం చేసుకుంటాడు. నీవు నిర్మించిన హాలంపురం క్షేత్రంలో నివసించే వారికి శ్రీశైల శిఖర దర్శనంకన్నా, కాశీ మరణంకన్నా అధికమైన ఫలాన్ని నేను అనుగ్రహిస్తాను అన్నాడు శివుడు.

ఈ విధంగా కాశీ విశ్వేశ్వరుడు చేసిన ఉపదేశం వల్ల, ఆ బాల భక్తుడు రససిద్ధుడై, తల్లిని వెంట బెట్టుకొని దక్షిణ దిక్కుగా బయలు దేరాడు. ప్రతిరోజూ అతడు ధ్యాన సమాధిగతుడై జ్ఞాన నేత్రంలో ఆలయాలను దర్శించేవాడు. కళ్ళు తెరిచి, రాళ్ళను అభిమంత్రించి కూలి వారితో, ఆలయ నిర్మాణం సాగించేవాడు. తన రసయోగంతో రాతి ముక్కలను బంగారు ముక్కలుగా మార్చి కూలీలకు జీతాలు

ఇచ్చేవాడు. అలా బంగారాన్ని అకర్షిస్తూ ఉన్నందువల్ల క్రమంగా ఆ పురానికి హేమలాపురం అనే పేరు కూడా వచ్చింది.

చూస్తుండగానే ఆకాశాన్నంటే గోపురాలతో ఆలయ సమూహాలు గుత్తులు గుత్తులుగా వెలశాయి. మధ్యలో బాల బ్రహ్మేశ్వరాలయం దానికి ఇటూ అటూ కుమార బ్రహ్మ, అర్క బ్రహ్మ, వీర బ్రహ్మ, విశ్వ బ్రహ్మ, తారక బ్రహ్మ, గరుడ బ్రహ్మ, స్వర్గబ్రహ్మ, పద్మ బ్రహ్మ అనే నవ బ్రహ్మల ఆల యాలు వెలశాయి. ఆ నవ బ్రహ్మలు లింగాకారంలోనే వుంటారు. ఆలయాలన్నీ ఒకే మూసగా ఉంటాయి. బాల బ్రహ్మేశ్వరుడి తలపై మాత్రం చిన్న చిన్న గుంటలు వుంటాయి. ఈ లింగం చుట్టూ నారాయణ సాలగ్రామాలు వుంటాయి. ఈ లింగం మీద ఎన్ని నీళ్ళు పోసినా ఆ నీళ్ళు ఎటు పోతాయో కనిపించవు. రససిద్ధుడు బాలబ్రహ్మేశ్వర ఆలయంలోని గర్భగుడి లోనే జోగులాంబా దేవిని కూడా ప్రతిష్టించి, ఆమెకు ఇటూ అటూ చండీ, ముండీ విగ్రహాలను స్థాపించాడు. ఇసుకతో గణపతి విగ్రహం చేసి దానిని రససిద్ధి వినాయకుడు అనే పేరుతో గుడిలోని ఒక గూటిలో స్థాపించాడు. ఈ ఆలయంలోనే సప్తమాతృకా విగ్రహాలను కూడా ఆయన స్థాపించాడు. రససిద్ధి వినాయకుణ్ణి తడిమి చూస్తే గరుకుగా వుంటాడు. గట్టిగా రాస్తే ఇసుక రాలుతుంది.

బాల బ్రహ్మేశ్వరాలయానికి ఎదురుగా ఒక మండపంలో నాలుగు శిరస్సులతో బ్రహ్మమూర్తిని స్థాపించాడు. శివ, విష్ణు అభేద ప్రతి పాదకంగా, ఒక నరసింహస్వామి ఆలయాన్ని, చెంచులక్ష్మి ఆలయాన్ని, మాధవీశక్తి ఆలయాన్ని, ఆంజనేయ ఆలయాన్ని కూడా నిర్మించాడు. ఇలా ఏరోజు కారోజు పెరిగి పోతున్న ఆలయ సంఖ్యతో తుంగభద్రా తీరమంతా కూడా, ఆలయాలతో నిండిపోయింది. జోగులాంబాక్షేత్రం శక్తిపీఠంగా ఖ్యాతి పొందింది. శ్రీ జోగులాంబాదేవి దర్శనం సకల పాపహరణం.



శ్రీ జోగులాంబాదేవి ఆలయం

ప్రయాణ మార్గాలు




సమీప రైల్వేస్టేషన్ : అలంపురం  విమానాశ్రయం : హైదరాబాద్

శ్రీ జోగులాంబా : కర్నూలు పట్టణము నుండి హైదరాబాదు వెళ్లు మార్గములో తుంగభద్రనది ఒడ్డున అలంపురము గ్రామములో వెలసి యున్నారు. అమ్మవారు రౌద్ర రూపములో ఉన్నారు కనుక ప్రక్క నుండి చూడవలయును.

## శ్రీ భ్రమరాంబా మాత



శివ పార్శ్వ స్థితా మాతా - శ్రీశైలే శుభ పీఠకే
భ్రమరాంబా మహాదేవీ - కరుణారస వీక్షణా

**అష్టాదశ శక్తిపీఠాలలో ఆరవ శక్తిపీఠ దేవత శ్రీ భ్రమరాంబా దేవి.**
**ఈ దివ్యశక్తి ఆంధ్రదేశంలోని శ్రీశైల క్షేత్రంలో కొలువై వున్నది.**

## 16. శ్రీ భ్రమరాంబా శక్తి - శ్రీశైలం

**పూ**ర్వము "అరుణాసురుడు" అనే రాక్షసుడు ఉండేవాడు. వాడు తమోగుణ ప్రధానంగా "గాయత్రి" మంత్రం జపిస్తూ బ్రహ్మను గూర్చి పదివేల సంవత్సరములు తపస్సు చేశాడు. బ్రహ్మ వచ్చి వరము కోరుకోమన్నాడు అతడు అమరత్వము కావాలని కోరాడు. "నాకే కాలము తీరాక శరీరము వదలక తప్పదు. ఇక నీకు అమరత్వం ఎలా ఇస్తాను"? అన్నాడు బ్రహ్మ.

అయితే "ఆయుధాల చేతగాని, స్త్రీపురుషుల చేతగాని నాకు మరణం రారాదు" అని అరుణుడు కోరుకున్నాడు. ఆ వరబలంతో వాడు స్వర్గాన్ని ఆక్రమించి

లోకాలను పీడించసాగాడు. దేవతలు శివ, విష్ణువులను ప్రార్థించారు. అరుణుడికి గాయత్రీ జపం వల్ల ఈ శక్తి వచ్చింది. కనుక శివ, విష్ణువులు దేవతల చేత "అంబా యజ్ఞం" చేయించారు.

ఆ యాగం జరుగుతుండగానే బృహస్పతి అరుణాసురుడి దగ్గరకు వెళ్ళి "మేము ఉపాసించే గాయత్రినే నీవు ఉపాసిస్తున్నావు. కనుక నీవు కూడా దేవ జాతిలో వాడివే, కనుక నా శిష్యుడవే" అన్నాడు. ఆ మాటవిని అరుణుడు కోపించి గాయత్రీజపమే వదిలివేశాడు. ఇక్కడ దేవతలు రోజూ దేవీ ఉపాసన చేస్తుండగా, చివరకు ఒక రోజున దేవి సుందర రూపంతో ప్రత్యక్షమైంది. ఆ దేవి చుట్టూ కోట్లకొలది తుమ్మెదలు ఝుంకారాలు చేస్తూ ఉన్నాయి.

తరువాత దేవి ఆజ్ఞ వలన కోట్లకొలది ఆ తుమ్మెదల దండ్లు ఝుంకారిస్తూ అరుణాసురుడి, పురం మీద వ్రాలి రాక్షసులందరి తలకాయలు కొరికివేసాయి. బ్రహ్మ వరం ప్రకారమే ఆరుణాసుర సంహారము జరిగిన తర్వాత భ్రామరీ దేవి భక్తులను అనుగ్రహించటానికి భూలోకంలోనే ఉండదలచి సరైన ప్రదేశం కోసం అన్వేషించ సాగింది. అమె సహ్యాద్రి పంక్తుల వెంట తిరుగుతుండగా అద్భుతమైన మల్లె పొదల వాసన ఆమెను ఆకర్షించింది.

అక్కడి మల్లికార్జున జ్యోతిర్లింగాన్ని ఆమె దర్శించి అక్కడే ఉండిపోవాలని నిశ్చయించుకుంది. ఈమె మల్లికార్జున లింగానికి పశ్చిమంగా, కొంచెం ఎత్తుగా ఉన్నచోట స్థిరమూర్తి అయి నిలిచింది. ఈ దేవిని దేవతలు ఋషులు "భ్రమరాంబ" అని స్తుతించారు. ఆ కాలంలో ఆమెకు పద్దెనిమిది భుజాలు ఉండేవి. ఆ సమయములోనే మహిషాసురుడు అనే రాక్షసుడు విజృంభించగా వాడిని ఆమె సంహరించింది.

కానీ, వాడు ఆపై కల్పంలో తిరిగి జన్మించాడు. మళ్ళీ జన్మించిన జీవులను కథా సౌకర్యము కొరకై అదే పేరుతో వ్యవహరించటం పురాణముల సంప్రదాయం. ఈ రెండవ మహిషాసురుని కూడా ఈ దేవియే సంహరించింది. అప్పటికి ఆమె అష్టభుజి అయింది. ఆపై కల్పంలో కూడా మరల మహిషాసురుడు జన్మించాడు. అప్పటికి వాడు కొంత పవిత్రుడై దేవిని గుర్తించి తనను వాహనంగా స్వీకరించమని

ఆమెను ప్రార్థించాడు. దేవి ఇలా చెప్పింది.

ఓ మహిషా! మొదటి జన్మలో ఉగ్రచండీ రూపంతో (18 చేతులు) నిన్ను సంహరించాను. తరువాత జన్మలో భద్రకాళి రూపంతో నిన్ను సంహరించాను. ఇప్పుడు దుర్గారూపంతో నిన్ను నీ పరివారాన్నీ సంహరించబోతున్నాను. కానీ పూర్వం నిన్ను నేను నాపాదాలతో తాకలేదు. ఇపుడు వరం కోరుతున్నావు కనుక, నా పాదాల దగ్గర వుండేలా నిన్ను అనుగ్రహిస్తాను అని అన్నది.

అందువల్లనే ఇప్పటి భ్రమరాంబామూర్తికి 8 చేతులు, ఈమెకు వాహనం మహిషాసురుడే. ఈ క్షేత్రంలో అర్థనారీశ్వరీదేవి అనాదిగా మల్లికార్జున శివలింగమునకు ప్రక్కనే ఉన్నప్పటికీ – భ్రమరాంబ వచ్చినప్పటినుంచీ ఈమే ఇక్కడి ప్రధాన శక్తి అయినది. భ్రమరాంబ మల్లికార్జునుల వివాహం గురించి జానపద కథలు, కన్నడ దేశీయ కథలు చాలా వున్నాయి. కానీ, వాటికి పురాణాధారం లేదు భ్రమరాంబా పీఠం అష్టాదశ శక్తిపీఠాలలో ఒకటిగా ఎంతో ఖ్యాతి పొందింది. శ్రీ భ్రమరాంబాదేవి దర్శనం సకల పాపహరణం.



శ్రీశైల క్షేత్రమునకు వెళ్లుటకు ప్రయాణ మార్గాలు

ఆంధ్రప్రదేశ్, కర్నూలు జిల్లా




ఆంధ్రప్రదేశ్‌లోని దాదాపు అన్ని పట్టణాల నుండి శ్రీశైలంకు బస్సు సౌకర్యము కలదు. శ్రీశైలం హైదరాబాద్ నుండి 232 కి.మీ.దూరంలోను, విజయవాడ నుంచి డోర్నాల ద్వారా 260 కి.మీ. దూరంలోను, మరియు డోర్నాల నుండి 50 కి.మీ దూరంలోనూ ఉన్నది. శ్రీశైలంలో బస చేయుటకు దేవస్థానం కాటేజీలు, అతిథి గృహములతో పాటు, అనేక ధర్మశాలలు ఉన్నవి.

శ్రీ భ్రమరాంబ : ఆంధ్రప్రదేశ్‌లో కర్నూలు జిల్లా యందున్న పవిత్ర శ్రీశైల క్షేత్రములో శ్రీమల్లిఖార్జున జ్యోతిర్లింగ స్వామి వారి దేవేరిగా విరాజిల్లుచున్నారు.

## శ్రీ పురుహూతికా మాత



పురుహూతీ సతీమాతా - పీఠికాపుర సంస్థితా
పుత్రవత్పాలితా దేవి - భక్తానుగ్రహదాయినీ

**అష్టాదశ శక్తిపీఠాలలో పదవ శక్తిపీఠ దేవత శ్రీ పురుహూతికాదేవి. ఈ దివ్యశక్తి ఆంధ్రప్రదేశ్‌లోని పిఠాపురం క్షేత్రంలో కొలువై వున్నది.**

## 17. శ్రీ పురుహూతికా శక్తి - పిఠాపురం

**పి**ఠాపురం అనాదిగా కుక్కుటేశ్వర స్వామి క్షేత్రం. ఇక్కడ శివలింగం కుక్కుటాకారంలో వుంటుంది. అంటే కోడి ఆకారంలో వుంటుంది. దీనికో కథ చెపుతారు. ఏలుడనే మహర్షి శివుడి జటాజుటం నుంచి, ఒక చిన్న నదిని తీసుకురాదలచి శివుని గూర్చి తపస్సు చేశాడు.

శివుడు ఒక చిన్న గంగాపాయ ఇచ్చాడు. కాని అది పెద్ద నది కావటం శివుడికి ఇష్టం లేక పోయింది. అందువల్ల ఏలముని ముందుకు నడుస్తుండగా, ఒకచోట తాను కోడి లాగా కూశాడు. ఏలముని వెనక్కి చూశాడు. కోడి ఆకారంలో

వున్న శివుడు అక్కడే అలాగే శివలింగమై పోయాడు. ఆయనే కుక్కుటేశ్వర స్వామి. ఏలముని వెంట వచ్చిన నదికి “ఏలా నది” అని పేరు వచ్చింది. ఆ నదిని ఆ ముని అక్కడి కోనేరులో కలిసేటట్లు చేశాడు. పూర్వ యుగాలలో గయాసురుడనే రాక్షసుడు మహా తపస్సు చేసి, చాలా పవిత్రుడయ్యాడు. కానీ తన శరీరాన్ని వేల యోజనాలు పెంచేశాడు. అపుడు బ్రహ్మ విష్ణు మహేశ్వరులే కలిసి, అతని శరీరం మీద ఒక మహా యజ్ఞం చేసేడట్లుగా ఆ రాక్షసుడితో ఒప్పందానికి వచ్చారు. ఆ ఒప్పందం ప్రకారం అతడు కాళ్ళు చాచుకొని పడుకోగా, అతని శిరస్సు బీహారులోని గయ దగ్గరకు, పాదాలు పిఠాపురంలోని కుక్కుటేశ్వర స్వామి ఆలయం దగ్గరకు వచ్చాయి. ఆ పాదాలు వున్నచోట గొప్ప కొలను ఏర్పడింది. దానికి పాద గయ అని పేరు వచ్చింది. అప్పటి నుంచి పిఠపుర క్షేత్రం మరింత ప్రసిద్ధి కెక్కింది.

అదే క్షేత్రంలో సతీదేవి యొక్క అవయవ ఖండం కూడా పడింది. అప్పటి నుంచి అక్కడ ఒక శక్తి పీఠం వెలసింది. ఆ పీఠాన్ని మున్ముందు గా ఇంద్రుడు గుర్తించి ఆరాధించటం వల్ల ఆ దేవికి పురుహూతికా దేవి అని పేరు వచ్చింది. ఈ క్షేత్రంలో కుక్కుటేశ్వర స్వామి దక్షిణాభిముఖంగా వుంటాడు. ఆ స్వామికి ఎదురుగా ఒక చిన్న ఆలయంలో ఉత్తరాభి ముఖంగా పురుహూతికా శక్తిపీఠం నెలకొని వుంది. ఇలా ఈశ్వర, విష్ణు శక్తి పీఠాలతో పవిత్రమై ప్రకాశిస్తూ వున్న ఈ క్షేత్రంలోనే దత్తాత్రేయ స్వామి శ్రీపాద శ్రీవల్లభుడిగా అవతరించారు. శ్రీ పురుహూతికాదేవి దర్శనం సకలపాప హరణం.





పిఠాపురం శ్రీపాద శ్రీవల్లభ సంస్థానం

ప్రయాణ మార్గాలు




శ్రీ పురుహూతికా : ఆంధ్రప్రదేశ్‌లోని పిఠాపురము పట్టణములోని (తూర్పుగోదావరి) పాదగయ అయిన కుక్కుటేశ్వర స్వామి (పురుహూత స్వామి) వారి దేవేరిగా అలరారుచున్నారు. ఆలయములోపలి భాగములో ఉత్తరము ప్రాకారమై (గోడలో) నిక్షిప్తమై ఆదిశంకరుల వారిచే బహిర్గతమైన దేవేరిని పురుహూతికా అమ్మవారు. పూజారుల సహకారముతో దర్శన భాగ్యము పొందవచ్చును.

# శ్రీ మాణిక్యాంబా మాత



ద్రాక్షావటీ స్థితాశక్తిః - విఖ్యాతా మాణిక్యాంబికా
వరదా శుభదాదేవీ - భక్త మోక్ష ప్రదాయినీ

**అష్టాదశ శక్తిపీఠాలలో పన్నెండవ శక్తిపీఠ దేవత శ్రీ మాణిక్యాంబాదేవి.**
**ఈ దివ్యశక్తి ఆంధ్రదేశంలోని ద్రాక్షారామ క్షేత్రంలో కొలువై వున్నది.**

## 18. శ్రీ మాణిక్యాంబా శక్తి - ద్రాక్షారామం

**ద**క్ష ప్రజాపతికి దక్షిణాపథంలో కొంత రాజ్యభాగం వుండేది. రాన్ని దక్షవాటిక అని పిలిచేవారు. దక్షుడు ఆ ప్రాంతాన్ని విలాసమయంగా భోగ భూమిగా రూపొందించాడు.

దక్షయజ్ఞ భంగం తరువాత సతీదేవి యొక్క "కణిత" (కంటి పక్కన గల ఎముక భాగం, కొడితే ప్రాణం పోయే చోటు) ఒకటి ఈ దక్షవాటికలో పడ్డది. అప్పటి నుంచీ అక్కడ "మాణిక్యాంబిక" అనే పేరుతో ఒక శక్తి పీఠం వెలసి, అది ఒక క్షేత్రంగా వన్నెకెక్కసాగింది. ఇది ఇలా వుండగా తారకాసురుడు శివుని గూర్చి తపస్సు చేయసాగాడు. తారాకాసురుడు ఇలా శివుని గురించి తపస్సు చేసి రెండు

వరాలు పొందాడు. శివుడి అమృత లింగాన్ని తన హృదయంలో ధరించి వుండాలని ఒకటి. శివుడికి జన్మించిన పుత్రుడు మాత్రమే తనను సంహరించగలగాలని మరొకటి. శివుడికి పుత్రుడే పుట్టడనీ, ఎలాగో పుట్టినా తన హృదయంలో అమృత శివలింగం వుంటుంది కనుక, తనకు చావు సంభవించదనీ, వాడి ఆశ. కానీ శివ పార్వతీ కల్యాణం జరగనే జరిగింది. కుమార స్వామి జన్మించాడు. దేవతలు ఆయనను ప్రార్థించారు.

ఆయన దేవతల సేనాపతి అయ్యాడు. యుద్ధానికి వచ్చాడు. ఆ యుద్ధంలో కుమారస్వామి తన శక్తి ఆయుధంతో నేర్పుగా తారాకాసురుడి హృదయంలో గల అమృత శివలింగాన్ని బయటకు ఎగురగొట్టాడు. ఎగిరిన ఆ లింగం ఐదు ముక్కలై అయిదు చోట్ల పడి పొడుగాటి శివలింగాలుగా ఎదిగింది. అమృత ప్రభావం వల్ల ఆ అయిదు చోట్లా పంటలు, తోటలు బాగా పెరిగాయి. ఆ ఐదు ప్రదేశాలకీ పంచారామ క్షేత్రాలని పేరు వచ్చింది. ఆరామమంటే తోట.

దాక్షారామం అంటే వెనుకటి రోజులలో దక్ష ప్రజాపతి పాలనలో వుండిన దక్షవాటికే. తరువాత కాలాలలో అక్కడ ద్రాక్ష తోటలు బాగా పెరగటం చేత దాన్ని ద్రాక్షారామమని గూడా పిలువసాగాడు. దాన్ని బట్టే ద్రాక్షారం అనే వ్యవహార నామం వచ్చింది. ఆ విధంగా శక్తి పీఠంతో పాటు ఇక్కడ అమృత శివక్షేత్రం కూడా వచ్చేసరికి, క్షేత్ర ప్రశస్తి మరింత పెరిగింది. ఇక్కడి శివుడికి భీమేశ్వరుడని పేరు వచ్చింది.

ఇలా వుండగా సప్తరుషలకు ఈ స్వయం ప్రతిష్ఠితులైన భీమేశ్వర స్వామికి మాణిక్యాంబకు పునఃప్రతిష్ఠోత్సవాలు చెయ్యాలని ఉత్సాహం పుట్టింది. దానికి మరొక ముహూర్తం నిశ్చయించుకొన్నారు. ముహూర్తం రేపనగా వారు దక్షారామం చేరారు. కానీ గోదావరి బహుదూరంలో ధవళేశ్వరం వద్ద వుండటం చేత ఈ క్షేత్రానికి తీర్థస్నాన సౌకర్యం లేకపోవటం వారికి బాధగా తోచింది. తామైతే ఆకాశ గమనంలో పోగలం. మరి సామాన్యుల మాటేమిటి? పైగా శివుడి నిత్యాభిషేకానికి నదీ జలం కావద్దా? అందువల్ల ఆ తెల్లవారు ఝామున వారు ధవళేశ్వరం వెళ్ళి, గోదావరీ స్నానం చేసి, ఆ నదీమ తల్లిని దక్షవాటిక పక్క నుంచీ ప్రవహించమని ప్రార్థించారు.

గోదావరి వారి వెంట బయలుదేరింది. సప్తర్షులు ఆకాశంలో సాగుతున్నారు. నది భూమి మీద పరుగులు తీస్తోంది. దారిలో "తుల్యభాగా" అని గోదావరీ

ఉపనది ఒకటి వుంది. ఆ నదీ తీరంలో కొందరు మునులు భక్తి శ్రద్ధలతో యజ్ఞం చేస్తున్నారు. వస్తున్న వరద గోదావరి ఆ యజ్ఞశాలను పూర్తిగా ముంచేసింది. దాంతో కోపగించిన మునులు "గోదావరిని ఎండిపొమ్మని" శపించారు. అది విని ఆగ్రహించిన సప్తర్షులు "తుల్యభాగా నదిని తాకితే పాతకాలు అంటుకొంటా" యని శపించారు. ఇలా గందరగోళం జరుగుతుండగా, పూజ్యులైన తుల్యభాగ మహాముని వారిద్దరి మధ్యలోకి వచ్చి ఇరువర్గాలను శాంతింపచేశాడు.

నిజానికి ఈ మహర్షి సన్నిధి వల్లనే ఆనదికి తుల్యభాగా అని పేరు వచ్చింది. ఈయన దేవదానవులిద్దరికీ పూజ్యుడుగా వుండేవాడు. ఆయన వచ్చి ఆగమనే సరికి ఇరు వర్గాలవారూ కొంచెం తగ్గి, తిట్లు ఆపారు. ఆయన ఇద్దరి తగవులూ విని "ఇద్దరూ మంచిపనే చేస్తున్నారు. ఇద్దరూ లోకహితమే చేస్తున్నారు. మరి జీవనదులనిలా శపించటం తగునా! ముందు మీ శాపాలను ఉపసంహరించండి". అని నచ్చ చెప్పాడు. జరిగిన దానికి ఇరు వర్గాల వారు నొచ్చుకున్నారు. కానీ శాపాలను ఉపసంహరించటం సాధ్యం కాదు కనుక సవరణలు చేశారు.

''గోదావరి ఇక్కడ ఇంకిపోయినా అంతర్వాహినిగా సాగి మళ్ళీ బయటపడుతుంది" అన్నారు దానవ మునులు "తుల్యభాగను రోజూ తాకరాదు కానీ. విశేష పర్వాలన్నిటిలోనూ తాకవచ్చు. అపుడు వందరెట్లు ఫలం వస్తుంది" అన్నారు. సప్తర్షులు.

ఆ విధంగా రాజీ కుదిరి సప్తర్షులు గోదావరీ నదిని దక్షవాటి ప్రాంతానికి తీసుకువెళ్ళె సరికి, శివ లింగం ప్రతిష్టకు వాళ్ళు పెట్టుకున్న ముహూర్తం దాటిపోయింది. హడావిడి పడుతూ సప్తర్షులు వెళ్ళి చూసేసరికి భీమేశ్వర లింగాన్ని ఎవరో ప్రతిష్ట చెయ్యటమే కాక బ్రహ్మాండంగా పూజ గూడా చేసేశారు. సప్తర్షులకు, ముహూర్తం దాటి పోకుండా ప్రతిష్ట అయిందని ఒక పక్క సంతోషం, మరో పక్క తమకు ఆ అదృష్టం తప్పిపోయిందే అని దుఃఖమూ కలిగింది. ఎవరా ఈపని చేసింది అని వారు అలోచిస్తున్నంతలో సూర్య భగవానుడు దిగివచ్చి "మునులారా! తొందర పడకండి మీ ముహూర్తం గొప్పది స్వామి ప్రతిష్టయిపోయాడు. ఆయన్ని ఎవనూ ప్రతిష్ట చెయ్యలేదు. అది గమనించి నేను పరుగు పరుగున వచ్చి మొదటి పూజ చేశాను. నా తరువాత బ్రహ్మ, విష్ణువు, ఇతర దేవతలు కొందరు అర్చనలు చేశారు" అని చెప్పాడు.

"ఇదేమిటి? ఇలా జరిగిపోయింది" అని సప్తర్షులు బాధపడుతుంటే ఆకాశంలో అశరీరవాణి వినిపించింది. "మహర్షులారా! బాధపడవద్దు. మీ భక్తికి మెచ్చే భీమేశ్వరుడిలా చేశాడు. స్వామి నిత్యాభిషేకానికి గోదావరిని తెచ్చి వాకిట నిలిపారు. అది సామాన్యమైన పనా? మీరు పెట్టిన ముహూర్తం దాటి పోరాదనే స్వామి తనంత తానుగా ప్రతిష్ట పొందాడు. ఇక మీరు అర్చన చేయలేదని బాధపడవద్దు. మీరు ఏడుగురు మొదటి అర్చకుడు ఈ సూర్యుడు ఇక పైన మీ గోత్రాలవారికే ఈ స్వామికి అర్చన చేసే హక్కు వుంటుంది. ఆ విధంగా ఎనిమిది వంశాల వారు అక్కడి అర్చకులయ్యారు. అక్కడి గోదావరికి సప్తర్షుల వల్ల సప్త గోదావరము అని పేరు వచ్చింది. సప్తర్షులు మాణిక్యాంబా భీమేశ్వరులను స్తుతించారు. ప్రస్తుతం వున్న ఆలయం 14వ శతాబ్ధిలో రెడ్డి రాజులు నిర్మించారు. ఈ ఆలయం ఊరి మధ్యలో 3ప్రాకారాలతో 4గాలిగోపురాలతో వుంది. ఇక్కడ ప్రస్తుత మాణిక్యాంబికా విగ్రహాన్ని శంకరాచార్య స్వామివారు ప్రతిష్ఠించారని ప్రతీతి.

ఆంధ్ర దేశానికి త్రిలింగ దేశమని పేరు వుంది. ఆ త్రిలింగాలు శ్రీ కాళహస్తి, శ్రీశైలం, శ్రీకాళేశ్వర లింగాలని ఒక పక్షం. శ్రీకాళహస్తి, శ్రీశైల, దాక్షారామ భీమేశ్వర లింగాలని ఒక పక్షం. మాణిక్యాంబాకా శక్తి భీమేశ్వర స్వామికి ఉత్తర దిక్కుగా వున్నది. మాణిక్యాంబికా శక్తి వల్లనే భీమేశ్వరం పంచరామాలలో మరింత ప్రసిద్ధ క్షేత్రంగా విరాజిల్లుతోంది. శ్రీ మాణిక్యాంబా దర్శనం సకలపాప హరణం.

## ప్రయాణ మార్గాలు




**శ్రీ మాణిక్యాంబ : ఆంధ్రప్రదేశ్‌లోని తూర్పుగోదావరి జిల్లాలో రామచంద్రపురమునకు సుమారు 12 కిలోమీటర్ల దూరములో ద్రాక్షారామము పట్టణములో వేంచేసి యున్న శక్తి పీఠము.**

# ముక్తాయింపు

**మా అష్టాదశ శక్తిపీఠ** యాత్రకు దారి తీసిన పరిస్థితులను ముందుమాటలో వివరించడం జరిగింది. పీఠాల విశిష్టత, స్థల పురాణం గురించి కూడా వివరించడం జరిగినది. సాధ్యమైనంత వరకు మరియు వీలున్నంత వరకు అన్ని వివరాలను కూలంకషంగా మీ ముందు ఉంచుటకు కృషి లోపము లేకుండా ప్రయత్నం చేయుట జరిగింది. ఈ పద్దెనిమిది శక్తి పీఠాలే కాకుండా దగ్గరగా ఉన్న కొన్ని పుణ్యక్షేత్రములను కూడా దర్శించుకొనుట జరిగినది. వాటి యొక్క వివరాలు కూడా పాఠకుల ముందు ఉంచకపోతే నా యాత్రానుభవ విశేషాలు సంపూర్ణము కాదు అనే ఉద్దేశ్యముతో తారీఖుల వారీగా రైళ్లు, విమానాలు మరియు బస్సుల వివరాలను కూడా ఈ క్రింది ప్రకారముగా జరిగినవని మీకు తెలియజేయుటకు సంతసిస్తున్నాను. అయితే విశేషం ఏమిటంటే మేమందరము ఎట్లా వెళ్లామో, ఎంత మంది వెళ్ళామో అంతమందీ అదే ప్రకారముగా పూర్తి ఆరోగ్యముతో ఏ డాక్టరు వద్దకూ వెళ్లకుండా తిరిగి వచ్చామంటే అది జగన్మాత రాజరాజేశ్వరి అనుగ్రహము సంకల్ప బలము అని చెప్పక తప్పదు. ఇక వివరాలలోకి వెళితే...

4-3-17న సాయంత్రం హౌరానుండి వచ్చే రైల్లో యశ్వంత్‌పూర్ (బెంగుళూరు) వెళ్ళడం జరిగింది.

5-3-17 ఉదయానికల్లా యశ్వంతపూర్ (బెంగుళూరు) చేరుకొని 183 కిలోమీటర్ల దూరంలోఉన్న మైసూర్‌కు చేరటం జరిగినది. స్నానపానాదులు పూర్తి చేసుకుని చాముండీశ్వరి అమ్మవారిని దర్శనం చేసుకుని మరియు మైసూర్ మహారాజా ప్యాలెస్ దత్తాత్రేయ ఆశ్రమం చూసుకొని రాత్రికి అక్కడే బసచేసినాము.

6-3-17న 250 కిలోమీటర్ల దూరంలో నున్న శృంగేరీ వెళ్ళడం జరిగింది. అక్కడ జగద్గురు ఆదిశంకరాచార్యుల వారు ప్రతిష్టించిన శారదా మాతను దర్శించుకున్నాము. సూర్యభగవానుడి లేత కిరణాలు అమ్మవారి పాదాల మీద పడి గర్భాలయమంతా కూడా అఖండ దేదీప్యమానముగా వెలిగిపోవడం దానిని మేము కళ్ళారా చూసి తన్మయత్వం చెందడం మా అదృష్టం. (కాశ్మీరులోనున్న సరస్వతీ అమ్మవారిని ఆదిశంకరాచార్యుల వారు తీసుకుని వచ్చి ఇక్కడ ప్రతిష్ట చేశారని కూడా చరిత్రకారులు చెబుతున్నారు)

7-3-17 న శృంగేరి నుండి బయలుదేరి నలభై ఐదు కిలోమీటర్ల దూరంలోనున్న హొరనాడులోని బంగారు అన్నపూర్ణమ్మను (శక్తిపీఠం కాదు) దర్శించుకుని రాత్రికి బెంగుళూరు చేరినాము. దారిలో బేలూరులోనున్న లక్ష్మీచెన్నకేశవస్వామి మందిరమును దర్శించుకున్నాము. దేవాలయ శిల్ప సౌందర్యాన్ని వ్రాయనలవి కాదు. అమరశిల్పి జక్కన్న కళా వైదుష్యమంతా చెప్పనలవికాని అనుభూతిని మిగిల్చింది. మందిర నిర్మాణం పూర్తి చేయుటకు నూట పదమూడు సంవత్సరములు పట్టినదని ఆలయములో ఉండే పూజారులు చెప్పడం జరిగినది. రాత్రి పది గంటల ముప్పయ్ నిముషములకు రైల్లో బెంగుళూరు నుండి చెన్నైకు ఉదయానికల్లా చేరుకుని చెన్నై నుండి కంచి వెళ్లి కామాక్షి తల్లిని, ప్రసిద్ధి గాంచిన వరద రాజస్వామి దేవాలయములను దర్శించుకున్నాము. మాలో కొంతమంది కంచిలో షాపింగ్ చేయుట జరిగినది. ఎందుకంటే కంచి పట్టు చీరలకు ప్రసిద్ధి గనుక.

8-3-2017న కంచి నుండి చెన్నై వచ్చి మీనంబాకం విమానాశ్రయం నుండి 9-3- 2017న కొలంబో (శ్రీలంక) చేరుకుని అక్కడ నుండి ట్రింకోమలై వెళ్లి, శాంకరీ దేవి శక్తి పీఠాన్ని దర్శించుకొనుట జరిగినది. 9-3-2017, 10-3-

2017, 11-3-2017 న శ్రీలంకలోని మిగిలిన చూడదగ్గ ప్రదేశములు అనగా సీతా సాధ్వి అగ్ని ప్రవేశం చేసిన స్థలము, సీతా మాతను అశోక వనంలో ఉంచిన ప్రదేశాలను స్వామి చిన్మయానంద గారిచే స్థాపించబడిన చిన్మయా కోవిల్, రామ పాదుకలు ఉంచిన దేవాలయం, భరతుని దేవాలయము మొదలగు దేవాలయములన్నీ బోటులో వెళ్ళి చూడడం, సాయంత్రానికల్లా కొలంబో విమానాశ్రయానికి వచ్చి, అక్కడ నుండి 12-3-2017న ఉదయానికల్లా చెన్నై వచ్చి అక్కడ నుండి రైల్లో భువనేశ్వర్‌కు 13-3-2017న చేరుకున్నాము. ఉదయం అల్పాహారం అనంతరం పూరీలో ఉన్న బలబద్ర జగన్నాథ స్వామివార్లను దర్శనం చేసుకుని భోజనానంతరం బస్సులో జాజిపూర్‌లోని గిరిజా దేవి శక్తి పీఠం ను దర్శనం చేసుకుని అక్కడి నుండి కటక్ చేరుకుని 14-3-2017 సాయంత్రానికి వారణాశి విశ్వేశ్వర స్వామి సన్నిధికి చేరుకొనడం జరిగింది. 14-3-2017, 15-3-2017, 16-3-2017 వారణాశిలో బస చేసి అన్నపూర్ణమ్మ తల్లి, విశాలాక్షమ్మ తల్లి, కాలభైరవ దేవాలయము, విశ్వేశ్వరాలయము, దశాశ్వ ఘాటు, కేదార ఘాటు, హరిశ్చంద్ర ఘాటు తదితర క్షేత్రములను చూసకొని 17-3-2017న శ్రీ రామచంద్రమూర్తి సీతా లక్ష్మణ సమేతుడై వనవాసం చేసిన చిత్రకూట పర్వతం దర్శించుకుని రాత్రికి అలహాబాదు చేరుకొనుట జరిగినది. 18-3-2017న అలహాబాదులో వెలసియున్న ప్రయాగే మాధవేశ్వరి శక్తి పీఠాన్ని దర్శించుకొనుట జరిగినది.

అయితే ఇక్కడే ఇంకో లలితా దేవి అమ్మవారి పీఠం కూడా ఉన్నది. దానిని కూడా శక్తిపీఠమని (ఆధారాలు లేవు) అని చెప్పినందువల్ల ఆ చల్లని తల్లి ని కూడా దర్శనం చేసుకొనుట జరిగినది.

19-3-2017న గయ చేరి పిండ ప్రదానములు చేసుకునేవారు చేసుకొనిన పిమ్మట విష్ణుపాదం, వగైరా దేవాలయములను దర్శించుకొని, మాంగల్యగౌరి శక్తి పీఠాన్ని దర్శనం చేసుకొని, కలకత్తాకు ది. 20-3-2017 ఉదయానికల్లా రైలులో చేరడం జరిగినది. 20-3-2017, 21-3-2017, 22-3-2017లలో కలకత్తాలోనే రాత్రి బసచేసి చూడ వలసిన ప్రదేశములు కలకత్తా కాళీ మాత (అష్టాదశ శక్తి పీఠం కాదు) రామకృష్ణ పరమ హంస ఆశ్రమం, స్వామి వివేకానంద ఆశ్రమంతో బాటుగా 90 కిలోమీటర్ల దూరంలో నున్న పాండువా గ్రామంలోని శృంఖలాదేవి

శక్తి పీఠాన్ని దర్శించుకొనుట జరిగినది. మరియు గంగా సాగర సంగమ స్నానం, కపిల మహర్షి ఆశ్రమం చూసుకొని, 23-3-2017న ఉదయాన్నే విమానములో డమ్ డమ్ విమానాశ్రయం నుండి గౌహతి (అస్సాం రాష్ట్రం)లోని కామాఖ్య అమ్మవారి పీఠాన్ని దర్శించుకుని, రాత్రికల్లా విమానములో ఢిల్లీ చేరి అక్కడ నుండి మూడుగంటలు ప్రయాణం చేసి, కురేక్షేత్రం చేరుట జరిగినది.

24-3-2017న కురుక్షేత్రంలోని దర్శనీయ స్థలములయినటువంటి భీష్మాచార్యులవారి దేవాలయము, వారి అంపశయ్య, మరియు శ్రీకృష్ణపరమాత్మ అర్జునునకు గీతోపదేశం చేసిన స్థలము, బ్రహ్మ మానస సరోవరం మొదలగునవి దర్శించుకుని రాత్రికి అమృత్‌సర్ వెళ్లి అక్కడ నున్న స్వర్ణదేవాలయము జలియన్‌వాలా బాగ్ లను చూసి 25-3-2017 న హిమాచల్ ప్రదేశ్ రాష్ట్రంలోనున్న దర్మశాల (మెక్‌డోల్ గంజ్) లోని బౌద్ధుల మత గురువు దలైలామా ఆశ్రమానికి వెళ్లుట ఒక పెద్ద అనుభూతిని కలిగించింది. చిన్నకారులో చాలా ఎత్తుమీదనున్న ఆశ్రమంలోనికి వెళ్ళి కిందకి చూస్తే మనం ఇంతపైకి వచ్చామా అని సంభ్రమాశ్చర్యాలకు లోనయ్యాము. ఆశ్రమాన్ని చూసుకుని జ్వాలాముఖి చేరడం జరిగినది.

26-3-2017న జ్వాలాముఖి అమ్మవారిని దర్శనం చేసుకుని రాత్రికి కాత్రా చేరడం జరిగినది. 27-3-2017న కాత్రాకు పదమూడు కిలో మీటర్ల దూరంలో ఉన్న శక్తిపీఠమయిన వైష్ణవీ మాతను కొంత మంది గుర్రాలపైన, కొంతమంది డోలీల పైన మరికొంత మంది హెలికాప్టర్‌లోనూ, నడవ గలిగిన వారు నడకతో వెళ్లి తల్లిని దర్శనం చేసుకొనుట జరిగినది. ఆ మరుసటి రోజు నుంచే దేవీ నవరాత్రులు అవటంలో ఆ తల్లికి విశేషంగా పూలతో అలంకరణ చేసి మాకు దర్శన భాగ్యమును కలగ జేసిన దేవస్థానం వారికి మనసులోనే కృతజ్ఞతలు తెలుపుకున్నాము. మరియు విఘ్నేశ్వరుని విగ్రహాన్ని కూడా పూలతో తయారు చేసి భక్తులందరకు మహదానంద భాగ్యమును కలుగజేసినారు.

28-3-2017న కాత్రా నుండి బయలుదేరి జమ్ము విమానాశ్రయం చేరుకుని, శ్రీనగర్ చేరుట జరిగినది. శ్రీనగర్‌లోని సారికా మాత, ఖీర్ భవానీ మాతలను దర్శించుకుని అక్కడే ఉన్న జగద్గురు శంకారాచార్యుల వారిచే ప్రతిష్టించబడిన శివుని విగ్రహం 250 మెట్లు ఎక్కి దర్శనం చేసుకుని శంకరాచార్యులవారు నివశించిన

గుహను కూడా దర్శించు కొనుట జరిగినది. ఖీర్ భవానీ అమ్మవారు నీళ్లలో ఉండి దర్శనమిస్తుంది. ఆ నీళ్లు కూడా పాలవలె స్వచ్ఛముగా తెల్లగా ఉంటాయి. రాష్ట్రానికి ఏదయినా విపత్తుగాని ఆపదగానీ వస్తే ఆ నీళ్లు రంగు మారుతాయని, శ్రీలంకలో ఉన్న పార్వతీ దేవిని ఆంజనేయస్వామి ఆమె కోరికపై ఇక్కడ ప్రతిష్టించినట్లు అక్కడ పూజారులు వివరించడం జరిగినది.

శ్రీనగర్‌లో డాల్ సరస్సు మరియు తులిప్ గార్డెన్సు (దివంగత ప్రధాని శ్రీమతి ఇందిరాగాంధీ స్మృత్యర్థం ఆమె కోడలు సోనియాగాంధీ గారిచే ప్రారంభింపబడినది.) భారత దేశంలో ఇటువంటి పూ దోటలు, శ్రీనగర్‌లో తప్ప మరెక్కడా లేవు. మనోరంజకంగా, ఎంతో అందముగా ఈ పూ దోటలను చూసి అభినందించని వారు ఎవరూ ఉండరు. సంవత్సరములో రెండు నెలలు మాత్రమే ఈ పూదోటలో పూలు పూస్తాయి.

29-3-2017న హేవళంబి నామ సంవత్సర ఉగాది వేడుకలను మా యాత్రీకు లందరూ కలసి శ్రీనగర్‌లోని మేము బస చేసిన హొటల్లోనే జరుపుకొని, వేప ప్రసాదములను స్వీకరించి ఒకరినొకరు ఆనందోత్సాహాలతో అభినందనలు తెలియపరచు కొనుటం జరిగినది. సాయంత్రం శ్రీనగర్ నుండి ఢిల్లీ చేరి రాత్రి పది గంటలకు ఢిల్లీ నుండి ఉజ్జయినికి 30-3-2017 ఉదయం పది గంటలకల్లా చేరుకున్నాం. ఉజ్జయినిలోని మహాకాళి శక్తి పీఠం, మహాకాళి జ్యోతిర్లింగం శ్రీ కృష్ణపరమాత్మ విద్యను అభ్యసించిన సాందీపుని యొక్క గురుకులం, విక్రమాదిత్య సింహాసనాన్ని, రాత్రికి పరమ శివునికి జరిగే భస్మాభిషేకం చూసుకుని మరుసటి రోజు అంటే 31-3-2017న ఉజ్జయిని నుండి బయలుదేరి ఓంకారేశ్వర్‌లోని ఓంకారేశ్వర్, అమరేశ్వర్, జ్యోతిర్లింగాలను దర్శించుకొనుట జరిగినది. 1-4-2017న ఇండోర్ నుండి బయలుదేరి పూనాకు మరుసటి రోజు అనగా 2-4-2017న మధ్యాహ్నానికి చేరుకుని పూనా నుండి 240 కిలోమీటర్ల దూరంలో ఉన్న కొల్హాపూర్ చేరుకొనుట జరిగినది.

3-4-2017న మహాలక్ష్మి అమ్మవారి శక్తి పీఠాన్ని దర్శనం చేసుకుని పూనాకు తిరిగి చేరుకున్నాము. పూనా నుండి నాందేడ్ ఎక్స్‌ప్రెస్‌లో బయలుదేరి 4-4 -2017న నాందేడ్ చేరుకున్నాము. నాందేడ్ నుండి మినీ వ్యాన్‌లో బయలుదేరి

మాహ్యూర్‌లోని ఏకవీరికా అమ్మవారి పీఠాన్ని దర్శనం చేసుకొనుట జరిగినది. అయితే ఇదే గ్రామంలో పరశురాముని తల్లి అయిన రేణుకా దేవి దేవాలయము కూడా ఉన్నది. కొంత మంది ఇదే అసలయిన శక్తి పీఠం అని చెప్పుట జరిగినది. మేము అక్కడ వారిని విచారించగా దక్షిణాది రాష్ట్రాల నుండి వచ్చేవారు ఏక వీరికా అమ్మవారే శక్తి పీఠమనియు, ఉత్తరాది రాష్ట్రాల నుండి వచ్చేవారు రేణుకాదేవి పీఠమే అసలయినదనియు చెప్పుట జరిగినది అందువలన మేము ఏక వీరికా అమ్మవారితో బాటుగా రేణుకా దేవి అమ్మవారి ఆలయం కూడా సందర్శించుట జరిగినది. ఇంకా అక్కడ ఉన్న సతీ అనసూయ, గణేశ్ మందిర్, దత్తాశ్రమములను కూడా దర్శించు కొనుట జరిగినది.

అయితే రేణుకా దేవి దేవాలయమునకు సుమారు 250 మెట్లు ఉన్నవి. ఇవి కాకుండా ఇంకా అక్కడ చూడవలసిన ముఖ్యమైన దేవాలయములను చూసుకొని 5 - 4- 2017 ఉదయం దేవగిరి ఎక్స్‌ప్రెస్‌లో సికింద్రాబాదుకు చేరుట జరిగినది. ఈ దినం శ్రీరామనవమి పండుగ వడపప్పు, పానకం చేసి శ్రీరామచంద్రమూర్తికి నైవేద్యం సమర్పించి యాత్రీకులందరూ భక్తి శ్రద్ధలతో ఆ పరమాత్మకు నమస్కరించి ప్రసాదాన్ని స్వీకరించి ఒకరినొకరు ఆప్యాయతగా పలకరించుకొని శుభాభినందనలను తెలుపుకొనుట జరిగినది. సికింద్రాబాద్ చేరినప్పుడు మాలో ఉండే కొంత మంది యాత్రికుల బంధువులు మిత్రులు మా దగ్గరికి వచ్చి అందరినీ పలకరించి, పరామర్శించి మిఠాయిలు ఇవ్వడం జరిగినది. అక్కడ నుండి బస్సులో కర్నూలు వెళ్లి ఆరాత్రికి అక్కడ బస చేసి మరుసటి రోజు ఉదయం జోగులాంబాదేవిని దర్శించుకొనుట జరిగినది.

6-4-2017 ఆలంపురం నుండి బస్సులో బయలుదేరి రాత్రికి శ్రీశైలం చేరుట జరిగినది. ఆ రాత్రికి శ్రీశైలంలో బస చేసి 7-4-2017 ఉదయాన్నే మల్లికార్జున స్వామికి అభిషేకములు చేయించుకుని స్వామి దర్శనం చేసుకుని భ్రమరాంబికా అమ్మవారి శక్తి పీఠమును దర్శనము చేసుకుని విజయవాడ మీదుగా రాత్రికి రాజమండ్రి చేరినాము. మా ప్రయాణములోకెల్లా ఇదియే అత్యంత దూరమైన బస్సు ప్రయాణము. సుమారు పన్నెండు పదమూడు గంటలు బస్సులోనే ప్రయాణము చేయుట జరిగినది. 8-4-2017 మా యాత్రలో ఆఖరి రోజు చివరి రోజు. రాజమండ్రిలో అల్పాహారం

చేసి అక్కడి నుండి బయలుదేరి ద్రాక్షారామంలోని మాణిక్యాంబ శక్తి పీఠంను దర్శించుకుని పిఠాపురంలోని పురుహూతికా శక్తిపీఠం దర్శించుకుని, రాత్రి తొమ్మిది గంటలకు విజయవాడకు చేరుటతో ఈ యాత్ర పరిసమాప్తమయినది.

పై వివరాలు కొంత మందికి విసుగు పుట్ట వచ్చును. యాత్రలు చేయాలన్నవారికి సంతోషము కలగవచ్చును. ఏమైతే ఏంటి యాత్ర దిగ్విజయంగా, సంపూర్ణంగా పూర్తి చేసుకుని ఎవరెవరి స్వస్థాలాలకు క్షేమంగా, సంపూర్ణ ఆరోగ్యంతో చేరుట మాకు ఎంతో ఆనందాన్ని, సంతోషాన్ని మిగిల్చింది. శ్రీశ్రీశ్రీ విజయ రాజ రాజేశ్వరీ దేవత అనుగ్రహము, శ్రీ వాసుదేవానందగిరి స్వామీజీవారి దివ్య ఆశీస్సులు, యాత్రికుల చల్లటి మనస్సు స్నేహ పూర్వక అనుబంధం, టూర్ ఆపరేటర్‌లోని అకుంఠిత దీక్ష – యాత్రను దిగ్విజయం చేయాలనే బావుకతో ఈ యాత్ర పరిసమాప్తం కావడానికి కారణాలు అని చెప్పక తప్పదు. మాతో కలసి ప్రయాణం చేసిన వారికి ఇది చదివిన వారికి సమస్త జనులకు జగన్మాత ఆశీస్సులు, కరుణా కటాక్ష వీక్షణాలు మెండుగా వుండాలని ఆశిస్తూ,

శెలవు తీసుకుంటూ....

**మీ సోదరతుల్యుడు**

**పి.రోశారావు**

ఈ క్రింద మాతోపాటు యాత్ర చేసిన సోదర సోదరీమణుల వివరాలను వారి వారి ఫోటోలతో సహా ఇవ్వడమయినది దయచేసి గమనించగలరు. పాఠకుల సౌకర్యార్థమై మేము వివిధ ప్రాంతాలలో బస చేసిన హొటళ్ల చిరునామాలు కూడా ఇవ్వడమైనది. గనుక గమనించలగలరు.

1



1.**Sri Sri Sri vsasudevanandagiri swamiji**, D.No -1-105, Pedapulipaka, Krishna Dt. 521 137, Ph : 8341433329



2. **G.Leela Mallikharjuna Rao,** D.No.27-12-55, Alibag veedhi, Near Ashoka Hotel, Governarpet, Vijayawada - 520002,Ph: 9848126968

3. **G.V.L.Ratna Kumari**



4.**G.Chalapathi Rao,** Plot No - 06, LIC Colony, Kagidha Pattarai, Saidapet, Vellore - 632012, Ph: 9344644614

5. **G.Lakshmamma**



6. **M.Venu Gopala Rao**, D.No. 11-62-53, cannal Road, Near Nemali Building, Radham Center, Vijayawada - 520 001 Ph: 9392100958

7.**M.VijayaLakshmi**



8. **M.Mohan Rao,** D.No. 27-12-70, Alibeg veedhi, Near Annapurna Talkies, Governorpet, Vijayawada - 520 002, Ph: 9848122837

9. **M.Lakshmi Kumari**



10. **D.Upendra Rao,** D.No. 11-40-84, Pulipativari st.Vijayawada - 520001, Ph:9392102400

11.**D.Lakshmi Parvathi**



14. **K.Ramadevi**, D.No.76-8-10/2,Flat No. 103, S.S.Enclave, Bhavanipuram, Vijaywada - 520 002, Ph: 9160093888



17.**P.Rosa Rao**, H.No. 54-14-2, Flat No. 201, Sai Charan Residency,SrinivasaNagar,Bank Colony, Vijayawada 520008,Ph:9963096662

18. **P.Padmavathi**



12. **A.Venkateswara Rao,** D.No. 27-1-150, Near Challapalli Bunglow, Eluru Road, Vijayawa - 520002, Ph:9392976310

13. **A.Padmavathi**



15. **D.Srinivasa Reddy**, D.No. 41-20/1-29A, Gunturuvari street, Krishna Lanka, Vijayawada-520013, Ph: 9490794399

16. **D.Sreevani**



19. **M.RamaChandra Raju,**D.No. 25-8-4, Peddetivari st. Sri Rama Puram, Bhimavaram, West Godavari - 534 202, Ph:9490110255



20. **P.Thirupathi Reddy**, D.No. 1-102./2,Pedapulipaka, Krishna dt. - 521137, Ph: 9866195187

21. **P.Hemalatha**



22.**G.Ranganayakamma,** H.No.1-33-7,Addavari st, Nazarpet, Tenali,Ph: 9290847504



23. **M.Narasinga Rao**, c/o Cement and Hardware, Near One way Traffic, mainroad, S.Kota, Vijayanagaram-535145,Ph:9866562772
24. **M.Gunna Raju**



25. **k.Sudhakar Rao** Maruthi Hardware stores D.No. 27-37-146 M.G. Road, Beside Mahesh Bank, Vijayawada - 520002,Ph:9440606520
26. **K.Parvathi**



27. **D.Hemanth Kumar,** D.No. 10-14/2-24, Mallikharjunapeta, Akulavari Veedhi, Vijayawada - 520 001, Ph: 9848124759



28. **R.Indra Kumari,** D.No. 58-6-12, Karnavari st, Patamata, Vijayawada, Ph: 9440090660



29. **B.Swapna** 12, Karnavari st, Patamata, Vijayawada, Ph: 8985884678



30. **P.Venkateswara Rao,** c/o Venkatadri cloth stores, D.No. 1-144, Main Road, Sabbavaram, Vishakhapatnam(dt)-531035,Ph:9985049545
31. **P.Venkata Lakshmi**

## బస చేసిన హోటళ్ల వివరాలు







1434, Gol Bagh,
Opp. Railway Station,
Amritsar- 143001 (Punjab)

Ph. : 0183-2547111
0183-2557111

E-mail : hotelgrandhrideyamritsar@gmail.com
Website : www.hotelgrandhridey.com







C.S. No. 453, B/2, 'E' Ward,
Opp. Market Yard, Kolhapur- 416005.
**Tel. : 0231-2666685, 2656685**
Website : www.hotelkolhapursonypalace.com
Email.: hotelsonypalace@gmail.com







**Manoharamma Hotel Investments Pvt., Ltd.,**
# 26-3-7, JAMPET, RAJAMAHENDRAVARAM 533 103. A.P.
2461201 (4 LINES), 2465401 (6 LINES); FAX:0883-2461204
Visit us at: www.hotelanandregency.com









**P-11, DOBSON LANE, Howrah - 711 101**
**Phone : 033-2666- 4333, Fax : 033-2666-4343**
**E-mail : kapoorhotels@gmail.com**




Janaka **Wanigasekara**
B.Sc (hons), Hosp.mgmt (Aus)
Managing Director

Sigiriya Road, Inamaluwa,
Dambulla.
**Sri Lanka.**

Tel : 066 2 286 635
Mobile : 077 7 445 447
Fax : 066 2 286 230
E-mail : info@edengardenlk.com
: janaka@edengardenlk.com
Web : www.edengardenlk.com
Skype : janakawanigasekara


అష్టాదశ శక్తిపీఠాలు
1. శాంకరీ దేవి - శ్రీలంక
2. కామాక్షి దేవి - తమిళనాడు
3. శృంఖలా దేవి - ప.బెంగాల్
4. చాముండేశ్వరి - కర్ణాటక
5. జోగులాంబ - ఆంధ్రప్రదేశ్
6. భ్రమరాంభ దేవి - ఆంధ్రప్రదేశ్
7. మహాలక్ష్మి - మహారాష్ట్ర
8. ఏకవీరికా - మహారాష్ట్ర
9. మహాకాళి - మధ్యప్రదేశ్
10. పురుహూతికా - ఆంధ్రప్రదేశ్
11. గిరిజా దేవి - ఒరిస్సా
12. మాణిక్యాంబా - ఆంధ్రప్రదేశ్
13. కామరూపిణి - అస్సాం
14. మాధవేశ్వరి - ఉత్తర ప్రదేశ్
15. వైష్ణవీ దేవి - హిమాచల్ ప్రదేశ్
16. మాంగళ్య గౌరి - బీహార్
17. విశాలక్షీ - ఉత్తర ప్రదేశ్
18. సరస్వతి - జమ్మూ-కాశ్మీర్

